# ఎడ్డీతో మంచిగా

వర్జీనియా, తెలుగు: కె. సురేష్





క్రిస్టీ తమ వరండాలో ఉయ్యాల ఊగుతోంది. ఎండలు బాగా ముదిరాయి. ఇంత తీవ్రమైన ఎండలో ఏం చెయ్యాలో ఆమెకు తెలియటం లేదు. పక్కనే ఉన్న తీగ ఆకులు కోసింది. ఆమె ఎదురింటిలోనే ఎడ్డీ-లీ ఉంటాడు. అతడు ఐస్‌క్రీం తింటూ ఉన్నాడు.

‘ఈ వేసవి అంతా నా వెంట పడి నన్ను వేధిస్తాడు,’ అనుకుంది క్రిస్టీ.

ఎడ్డీ-లీతో మంచిగా ఉండాలని అమ్మ చెప్పింది. ఎందుకు? ఎందుకంటే అతడు ఒంటరిగా ఉంటాడు. ఎందుకంటే అతడిని ఎవ్వరూ పట్టించుకోరు. ఎందుకంటే అతడు ఇతరుల కంటే ‘తేడాగా’ ఉంటాడు.

దేవుడు అతడిని వేరేగా చాశాడని అమ్మ చెబుతుంది. అయితే అమ్మ మాటలు క్రిస్టీకి నచ్చలేదు. దేవుడు తప్పు ఎలా చేస్తాడు? తప్పు అంటూ చేస్తే ఎడ్డీ-లీ చేసి ఉండాలి.

మరో ఇంటిలో ఆమెకు జిమ్ కనిపించాడు. అతడు గోలీలతో ఆడుకుంటున్నాడు. ఉయ్యాల దిగి ఎవరూ చూడకుండా జిమ్ వాళ్ల ఇంటివైపుకి వెళ్లింది క్రిస్టీ.

జిమ్ వాళ్ల కంచె మీదకి ఎక్కి కూర్చుంది.

"హలో జిమ్," క్రిస్టీ పలకరించింది. ఆట ఆపి జిమ్ కూడా వచ్చి కంచె ఎక్కి కూర్చున్నాడు.

"చాలా వేడిగా ఉంది," అన్నాడు జిమ్. "ఇప్పుడు చెరువులో ఈత కొడితే బాగుంటుంది. నువ్వు కూడా వస్తావా? అక్కడ మనకు కప్ప గుడ్లు కూడా కనపడతాయి."

క్రిస్టీ సరేనంది. దగ్గర పొదల్లో తమ చెప్పులు దాచిపెట్టి చెరువు దారి పట్టారు.



ఎడ్డీ-లీ ఇంటి ముందు నుంచి వెళుతుంటే అతడు ఎంతో ఉత్సాహంగా, "హలో, క్రిస్టీ! హలో, జిమ్!" అన్నాడు.

కానీ క్రిస్టీ చెయ్యి లాగి జిమ్, "ఆ పిచ్చివాడితో మాట్లాడవద్దు," అన్నాడు.

ఎడ్డీ-లీ వరండా మెట్లు దిగి బయటకు వచ్చాడు. అతడి గడ్డానికి, బట్టలకు ఐస్‌క్రీం అంటుకుని ఉంది. అయినా అతడు సంతోషంగా నవ్వుతూ ఉన్నాడు. జిమ్ అతడిని పట్టించుకోకపోవటంతో క్రిస్టీ, "ఎడ్డీ-లీ, నువ్వు ఈ రోజు ఇంటి దగ్గరే ఉండు," అంది.

ఎడ్డీ-లీ ఏమీ మాట్లాడలేదు. అతడికి తప్పకుండా బాధ కలిగి ఉంటుంది. అతడి కోసం చాలా లాలీపాప్‌లు తెచ్చి ఉంటే బాగుండేది అనుకుంది క్రిస్టీ, అప్పుడతను రోజంతా వాటిని తింటూ ఉండేవాడు.

క్రిస్టీ చేతిని జిమ్ మళ్లీ లాగి, "పద, క్రిస్టీ!" అన్నాడు.

"ఎడ్డీ-లీ ఇంటికి వెళ్లిపో. త్వరగా వెళ్లు."



“అతను ఎంత పిచ్చివాడో చూడు. అతడికి మన మాటలు కూడా అర్థం కాలేదు.”

జిమ్ వెనక్కి తిరిగి కాలితో నేలను గట్టిగా తాటి, “ఎడ్డీ-లీ, ఇంటికి వెళ్లు!” అన్నాడు.

ఎడ్డీ-లీ నవ్వి, “నేనేమీ కుక్కను కాను, జిమ్,” అన్నాడు.

“అయితే కుక్కలాగా మా వెంట రాకు.”

దాంతో ఎడ్డీ-లీ ముఖం వేలాడేసుకుని తన ఇంటివైపుకి వెళ్లసాగాడు.

“అతడిని బాధపెట్టే హక్కు నీకు లేదు, జిమ్. అతడితో మంచిగా ఉండమని మా అమ్మ నాతో చెప్పింది.”



చెరువుకి వెళ్లే దారిలో చిన్న అడవి ఉంది. మెత్తటి ఆకుల వాసన, ఫెర్న్ మొక్కలను కాలితో తాకటం క్రిస్టీకి బాగున్నాయి. చెట్ల కింద నేల చల్లగా ఉంది.

“ఆ శబ్దం ఏమిటి?” క్రిస్టీ అడిగింది.

చెట్టు కొమ్మ మీద నుంచి ఎగిరిన లకుముకి పిట్ట నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ పెద్దగా అరిచింది. అది కాసేపు నీటి మీద స్థిరంగా ఎగురుతూ చివరికి ఒక్కసారిగా నీటిపైపుకి దూసుకెళ్లింది. అది నీళ్లలోంచి బయటకు వచ్చినప్పుడు దాని ముక్కులో ఒక చేప ఉంది.

జీమ్ నీళ్లలో తన కాలివేళ్లను ముంచాడు. “అక్కడ చేప ఉంది, చూడు!” అంటూ అరిచాడు.



"ఇక్కడ నాకు కప్ప గుడ్లు ఎప్పుడూ కనపడలేదు," అంది క్రిస్టీ.

"ఆ గుడ్లలోంచి బహుశ కప్ప పిల్లలు బయటకు వచ్చేసి ఉంటాయి."

క్రిస్టీని ఓదార్చటానికి జిమ్ అలా చెప్పాడు! చెరువు ఒడ్డున ఇసకలో కాళ్లు పెట్టుకుని కూర్చుంది క్రిస్టీ. ఆ ఇసక మెత్తని పరుపులాగా ఆమెకు అనిపిస్తోంది.

ఉన్నట్టుండి వాళ్లకి వింతైన అడుగుల చప్పుడు వినిపించసాగింది.

“ఆ శబ్దాలు ఏమిటి?” జిమ్ గొంతులో భయం.

“నాకు తెలియదు.”

ఆ శబ్దాలు దగ్గర కాసాగాయి. ఎవరివో అడుగుల చప్పుడు. ఛపాక్! ఛపాక్! క్రిస్టీ గుండె వేగంగా కొట్టకోసాగింది. దాక్కోటానికి, పరిగెత్తటానికి వాళ్లకి ఏ దారీ కనిపించలేదు.

“ఏదో రాక్షసుడి అడుగుల లాగా ఉన్నాయి,” గుసగుసగా అన్నాడు జిమ్.



గడ్డిలోంచి ఒక “రాక్షసుడు” వచ్చాడు. ధమ్! ధమ్! అంటూ శబ్దం చేస్తూ ఎడ్డీ-లీ వస్తున్నాడు.

“నువ్వు ఇక్కడ ఏమ చేస్తున్నావు?” జిమ్ కోపంగా అరిచాడు. తరువాత అతడు క్రిస్టీ వైపుకి తిరిగి, “ఈ పిచ్చోడు మన వెనకే వస్తాడని నేను అనుకుంటూనే ఉన్నాను,” అన్నాడు. అతని గొంతులో భయం ఇంకా స్పష్టంగానే తెలుస్తూ ఉంది. క్రిస్టీ కూడా భయపడింది. ఎడ్డీ-లీ చెరువు ఒడ్డున కూర్చుని ఆ ఇద్దరినీ చూస్తూ ఉన్నాడు.

“నేను దానిని పట్టుకున్నాను, జిమ్!” సంతోషంతో అరిచాడు ఎడ్డీ-లీ. తన చేతులను పైకెత్తి సలమాండర్‌ని చూపించాడు.

“ఏం చేశావో చూడు, ఎడ్డీ-లీ!” తడిసిన తన బట్టలు చూపిస్తూ అన్నాడు జిమ్. “నువ్వు వెళ్లు, మమ్మల్ని ఒంటరిగా వదిలిపెట్టు.”

క్రిస్టీ వైపు చూసి, “క్రిస్టీ, నువ్వు ఇది తీసుకో,” అన్నాడు ఎడ్డీ-లీ.

తన అరచేతులలోకి ఆ బుల్లి జీవిని తీసుకుంది క్రిస్టీ, అది మెత్తగా ఉంది.





"ఇక్కడ నాకు ఇప్పటివరకు కప్ప గుడ్లు కనపడలేదు," ఫిర్యాదు చేస్తున్నట్టు చెప్పింది క్రిస్టీ. ఆ ముగ్గురూ ఇప్పుడు చెరువు ఒడ్డున నడుస్తున్నారు.

చెరువును చూస్తూ, "అందంగా ఉంది, అద్భుతంగా ఉంది!" అంటున్నాడు ఎడ్డీ-లీ. ఎంత అందమో చెప్పటానికి అతడి రెండు చేతులూ చాచి ఉన్నాయి. చెరువులోని కమలం పువ్వులను, మెరుస్తున్న వాటి ఆకులను అతడు చూస్తున్నాడు. "మాటలకు అందని అందం!"

మొదటిసారి దృష్టి నిలిపి ఆ కమలాలను చూసింది క్రిస్టీ. "ఆ పూలు నిజంగా ఎంత అందంగా ఉన్నాయి! జిమ్, ఆ పూలు కోసుకుని వస్తావా, ఒక్కటైనా చాలు. అమ్మకు అవి బాగా నచ్చుతాయి. బల్లమీద పూల జాడీలో దానిని ఉంచుతుంది."

"చెరువులోకి ఏదైనా దారి ఉందా?" జిమ్ అడిగాడు.

"ఆ పూలు నేను తెస్తాను, క్రిస్టీ," అంటూ ఎడ్డీ-లీ చెరువులోకి దిగాడు. కొంత దూరం వెళ్లేసరికి నీళ్లు అతడి మోకాళ్ల వరకు వచ్చాయి, కానీ పూలు ఇంకా చాలా దూరంగా ఉన్నాయి. తడిసిన బూట్లతో అతడు నిరాశతో వెనక్కి తిరిగాడు.



“అతడు పిచ్చోడని నేను ముందే చెప్పాను కదా,” అన్నాడు జిమ్.

అప్పుడు ఎడ్డీ-లీ పరిగెత్తుకుంటూ అడవిలోకి వెళ్లాడు.

“అతడి మనసుని నువ్వు గాయపరిచావు.”

భుజాలు ఎగరేసి జిమ్ చెరువుకి రెండోవైపు వెళ్లసాగాడు. అతడి వెనకే వెళదామనుకుంది క్రిస్టీ.

అంతలో ధబ్, ధబ్ మంటూ అడుగుల చప్పుడు వినిపించసాగింది. అయితే ఈసారి ఆమె కంగారు పడలేదు. వచ్చేది ఎడ్డీ-లీ అని ఆమెకు తెలుసు. పరిగెత్తుకుంటూ వస్తున్న అతడి ముఖం ఎర్రగా ఉంది.

“ఇటు రా, క్రిస్టీ!” ఆమె చెయ్యి పట్టుకుని ఎడ్డీ-లీ లాగుతున్నాడు.

“ఎక్కడికి?”

“నీకు చూపిస్తాను.” అతడివెంట అడవిలోకి వెళ్లింది క్రిస్టీ.

క్రిస్టీని చెరువు గట్టువెంట తీసుకెళుతున్నాడు ఎడ్డీ-లీ. అక్కడ పెద్ద, పెద్ద చెట్లు, నీటి మడుగులు ఉన్నాయి. ఉన్నట్టుండి ఎడ్డీ-లీ ముందుకు పరిగెత్తాడు.



"ఇదే!" అతడు సంతోషంగా నవ్వుతూ అన్నాడు.

అడవిలో అక్కడ ఓ మాదిరి మడుగు ఉంది. దాని ఒడ్డున పొడవాటి గడ్డి ఉంది. చెట్ల కొమ్మలనుంచి పక్షుల కిలకిలారావాలు వినపడుతున్నాయి. మడుగులోని నీళ్లు తేటగా, చల్లగా ఉన్నాయి. నీటి మీద అందమైన ఎరుపు, తెలుపు తామరలు ఉన్నాయి. ఈ అడవికి క్రిస్టీ చాలాసార్లు వచ్చింది కానీ ఈ ప్రాంతాన్ని ఇంతకు ముందు చూడలేదు.



క్రిస్టీ మోకాళ్ల మీద కూర్చుని నీటిలో తన ప్రతిబింబాన్ని చూసుకుంది. ఆమె నెత్తిమీద ఒక తామర కిరీటం లాగా ఉంది. ఎడ్డీ ఆమెను చూసి నవ్వుతున్నాడు.

అతడి మనసులో ఇంకా ఏదో ఉంది.

"ఇటు రా క్రిస్టీ, నీకు చూపిస్తాను." క్రిస్టీ చెయ్యి పట్టుకుని ఆమెను మడుగుకి రెండవ వైపుకి తీసుకుని వెళ్లాడు ఎడ్డీ-లీ.



“చూడు!” ఎండకి వేడెక్కిన నీరు ఉన్న ప్రాంతాన్ని వేలితో చూపిస్తూ అతను అన్నాడు. అక్కడ నీటి మీద తేలుతూ కప్ప గుడ్లు ఉన్నాయి. ఒకదానికొకటి అతుక్కుని అవి ముత్యాల రాశి లాగా ఉన్నాయి. ప్రతి గుడ్డులో చిన్న కప్ప పిల్ల ఉంది.

“కప్ప గుడ్లు! భలే ఎడ్డీ-లీ! నువ్వు నిజంగా చాలా తెలివైన వాడివి. అందమైన తామర పూలు, కప్ప గుడ్లు రెండింటినీ నా కోసం వెదికి పెట్టావు!” క్రిస్టీ వంగి ఆ గుడ్లను దగ్గరనుంచి చూసింది. నలుసు లాగా ఉన్న కప్ప పిల్లలను కూడా ఆమె సూర్యకాంతిలో చూడగలిగింది.

“గుడ్లు తీసుకెళ్లటానికి ఏదైనా కావాలి,” అంది క్రిస్టీ.

అది విన్న ఎడ్డీ-లీకి కోపం వచ్చింది. ఊపిరి వేగవంతమయ్యింది. “వద్దు! వద్దు!” అని అతను అన్నాడు.

“సీసా లాంటిది ఉంటే గుడ్లను ఇంటికి తీసుకెళ్లవచ్చు.”

క్రిస్టీ వైపు ఎడ్డీ-లీ చూపుడు వేలు ఆడించాడు. ఎంతో ఆలోచించాక మాట్లాడుతున్నట్టు అతడి నోటి నుంచి మాటలు మెల్లగా వచ్చాయి. “తల్లి కప్ప... క్రిస్టీ...” ఆ తరువాత అతడు ఇంకేమీ మాట్లాడలేకపోయాడు.

“తల్లి కప్ప చాలా బాధపడుతుంది,” క్రిస్టీ వాక్యాన్ని పూర్తి చేసింది. “దాని గురించి నేను ఆలోచించనే లేదు. పద ఎడ్డీ-లీ, అమ్మ కోసం ఒక పువ్వు కోసుకుని వెళదాం.”



పువ్వు దగ్గరకు వెళ్లేసరికి వాళ్ల మోకాళ్ల వరకు నీళ్లు వచ్చాయి. అప్పుడు కదులుతున్న నీటిలో పిల్లలిద్దరి ప్రతిబింబాలు విచిత్రంగా కనిపించాయి. ఆ కదులుతున్న ప్రతిబింబాలకేసి ఎడ్డీ-లీ చూపించాడు.

"నువ్వు చాలా వింతగా కనిపిస్తున్నావు, క్రిస్టీ."

నీటి అలలతో క్రిస్టీ ముఖం వికృతంగా మారిపోయింది. అది చూసి క్రిస్టీ తన నోటి మీద చేతులు వేసుకుంది.



“ఏం పర్వాలేదు, క్రిస్టీ,” అతను అన్నాడు. “అలా కూడా నువ్వు నాకు బాగున్నావు.” తరువాత ఎడ్డీ-లీ పెద్దగా నవ్వుతూ, ఎడమ చేతిని గుండె మీద పెట్టుకుని, “ఇక్కడ ఉన్నదే అన్నిటికంటే ముఖ్యమైనది,” అన్నాడు.



ఆ ఇద్దరూ అడవి నుంచి ఇంటికి బయలుదేరారు. “జిమ్!!” క్రిస్టీ అరిచింది. దారిలో మధ్యాహ్నపు ఎండ ప్రకాశిస్తోంది. “ఇదంతా చూస్తే నువ్వు కూడా సంతోషిస్తావు!”

